శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలలకొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

| సంపుటము. ౩౪ | పార్థివ<br>చైత్రి-ఆషాఢములు. | సంచిక ౧-౨ |
|---|---|---|

## స్వవిషయము.



ప్రాచ్యపాశ్చాత్యరంగముల మహాసంగ్రామము ముగిసినది. కాని శాంతి యింకను నెలకొనియుండలేదు. మన దొరతనమువారి కంట్రోలు ఉత్తరువులు రద్దుపడినవెంటనే పరిషత్పత్రికను యథాప్రకారముగ విపులముగఁ బ్రకటింపఁగలము. పాఠకులకు మా మనవి

ఆంధ్రభాషయందు నేఁటి వాఙ్మయము నితరభాషలందువలెనే సర్వతోముఖముగ విస్తృతిని గాంచుచున్నది. భాషావిషయమున మాత్రము దానిపరిణామము ముదావహముగ లేదు. నేఁటిశాస్త్రచారిత్రకాదిగ్రంథములందును, కావ్యవాఙ్మయమునందును నుపయోగింపఁబడు భాష గ్రామ్యగ్రాంథికవ్యావహారికములలో నేదియుఁ గాక కొన్నితావుల దుర్గ్రాహ్యమై, అనన్వితమై యున్నది. ఏకాలమునందైనను భాషకు నియమము లుండుట తప్పదు. స్వచ్ఛందతవలన భాషాభివృద్ధి కొఱవడు ననుట నిస్సంశయము. పత్రికలయందును, విమర్శకవ్యాసములందును గూడ నిట్టిభాష యేయుపయుక్తమగుచున్నది. వీరు తాము వ్రాయుచున్న భాషయొక్క లక్షణముల గుర్తింపక, ప్రాచీనాంధ్రభాషకు "కృతక

భాష" యని హేళన మొనర్చుచున్నారు. సహృదయులై విమర్శన మొనర్చినఁ గృతక మెద్దియో వారికే తెలియఁగలదు.

ఇటీవలఁ బత్రికాప్రపంచమున ప్రఖ్యాతపురుషులై యుండి దమకు కీర్తిని గడించి పెక్కు సంవత్సరములు "కృష్ణాపత్రిక"ను నిర్వహించుచుఁ గడపిన శ్రీ ముట్నూరు కృష్ణారావు పంతులుగారు దివంగతులైరని వ్రాయుటకు మిక్కిలి విచారించుచున్నాము. వీరి సర్వతోముఖపాండిత్యము, దేశభక్తి, కార్యదీక్షయు నందఱకు విదితము. వీరి పత్రికలోని సంపాదకీయవ్యాసములలో గొన్ని గ్రంథరూపముగ ప్రకటింపఁబడినవి. వీరి గ్రాంథికభాషాభిమానమును కృష్ణాపత్రికను జదువువారందఱకును విదితమే. గ్రాంథికగ్రామ్యభాషావివాదసందర్భమునఁ దమ తండ్రిగారితో శ్రీ కృష్ణారావుపంతులుగారు "గ్రామ్యము అనుసరణ యోగ్యమా" అను విషయములో మీతో వాదించి గెలువలేము. కాని గ్రాంథికశైలిలో అందమున్నది గనుకఁ గళగ భావించి దాని ననుసరించవలెనని సమాధానము చెప్పినటుల శ్రీ గిడుగు సీతాపతిగారు తెలియఁబఱచియున్నారు. గ్రామ్యవ్యావహారికగ్రాంథికభాషా విషయమున గ్రాంథికభాషయొక్క పరమోత్కృష్టతను గ్రహించియే శ్రీ పంతులుగారు తమ పత్రికారాజమున దాని నుపయోగించిరి. ఆయన జీవితమునందలి ముఖ్యవిషయములు ఆంధ్రపత్రిక 1 జూలై సంచికలో శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు వ్రాసిన వ్యాసమునఁ జూడనగును.

మఱియు ది 2-7-45 న సుప్రసిద్ధభాషాభిమానులును పండితులు నగు శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిపంతులుగా రాకస్మికముగ మరణించిరి. వీరు ప్రథమమున బందరు నోబిల్ కళాశాలలో నధ్యాపకులుగ నుండి తరువాత గవర్నమెంటు ట్రాన్సులేటరుగఁ బనిచేసిరి. వీరికి సంస్కృతాంధ్రాంగ్లభాషలయందుఁ గల వైదుష్య మపారము. ఆంధ్రమున వీరి కవితాసామర్థ్య మందఱకును దెలిసినవిషయమే. ప్రమోదూత

సంవత్సరమున పెద్దాపురములో జరిగిన పరిషద్వార్షికసభకు వీరగ్రాసనాధిపతులై మన్ననఁబడసిరి. వీరి యధ్యక్షోపన్యాసము పరిషత్పత్రిక సం. ౧౯. సం. ౪. పుట ౧౦౯-౧౨౭ లయందుఁ బ్రకటింపఁబడినది. వీరి భాషాభిమానము ప్రశంసనీయము. వీరు పెక్కు కావ్యములను రచించిరని కూడఁ దెలియుచున్నది. అంతిమదినములలో వీరు వైరాగ్యప్రవృత్తి గలిగి కొవ్వూరునం దొక యాశ్రమమును స్థాపించి కాలమును గడపుచు నాకస్మికమరణము నొందిరి. వీరియొక్కయు, శ్రీ కృష్ణారావుగారియొక్కయు జీవితము లాదర్శప్రాయములనుట నిర్వివాదాంశము. వీరియాత్మలకు పరమేశ్వరుఁడు శాంతి నొసంగును గాక.

---

# కళాపూర్ణోదయము.

## ద: పూర్వారి సూర్యనారాయణశాస్త్రి.

(అనువృత్తము.)

వ్రాతప్రతులను ముద్రింపవలసివచ్చినప్పుడు పెక్కు లేఖక ప్రమాదములతో నిండినపాఠములు సందిగ్ధములుగా నుండవచ్చును. అందులకై ప్రత్యంతరములు పరిశీలించుచుఁ బాఠము సందిగ్ధముగా నున్నచో నున్న దున్నట్టు లుంచుటగాని తోఁచినరీతి సూచించుటగాని చేయవలసి యుండును. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు కొన్ని పాఠములను "నా సవరణ, తోఁచినట్లు సవరించితిని, అర్థసిద్ధికై సవరించితిని" అని వ్రాయుచు దిద్దివైచిరి. అందుఁ గొన్ని పూర్వప్రతులలో నున్నవియుఁ గొన్ని దిద్ద నవసరము లేనివియు నై యున్నవి. నూతనముద్రణమున నట్టి "నా సవరణలు" లేకుండఁ గవిహృదయసూచకము లనఁదగినపాఠములే యాయాతావుల సందర్భోచితముగను సన్నిహితముగను చేర్పఁబడినవి. పింగళసూరనార్యుని కావ్యమున మన సవరింపు లేల ?

ఈసందర్భమున వ్రాతప్రతుల పద్యసంఖ్యలు చూపఁబడి ముద్రితప్రతి యందలి పద్యసంఖ్యయు నీయఁబడినది.

(1) "అనిన నొకకొంతతడవు వడఁ దట్లు చేసి." ౩౮౨ వ. ప్ర. ౪౩ శ్రీ. ప్ర. ఇట "చేసి, అన్నట. చేసి, నానవరణ" అని పేజీక్రిందఁ జిత్తుప్రాఁత. ఈపద్యమునకును దీనితరువాతిపద్యమునకును నడుమ "ఇట్లు దివ్యదృష్టిం జూచి" అను శ్రీప్రతిగద్యము లభించుటచేఁ బైదిద్దుపాటు అనావశ్యక మై సందర్భము సరిపడినది.

(2) ఆకసమున విమానములలో నేఁగుచున్న దంపతులు చదరంగ మాడుచున్న సందర్భమును సూచించుపట్టున :-

"నీలం మహా బొంకకు నత్త మిమ్మా యనుచు" ఉ. ౧౨౦ వ. ప్ర. ౧౨౧ శ్రీ. ప్ర. ఇట వల్లాదివారు,

"నత్తకమ్మా. క. ఫ. బ. నత్తకమ్మ యాటచేఁ బాత మిచ్చి పాచికల కందె మున్నది. శ. ర. వ్రాఁతప్రతులు రెండిట నెత్తకమ్మా యని, యతితప్పినపాఠ మున్నది. అగస్థిత్రై 'నత్తమిమ్మా' సవరించితిని. క, ఫ. బ." అని పేజీక్రిందఁ జిత్తులోఁ వ్రాయించిరి. ఇట శబ్దరత్నాకరపాఠ మాశ్రయించుచో నసమంజసత్వ మేమి? అగుచు. నత్తకమ్మ నుద్దేశించి బొంకకుము. అనఁగా పాచికలపందెమును గూర్చి బొంకకుము. అని భావము. అంతేకాక తిరుపతి వేలూరు చిన్నయసూరి పాఠములలోఁ గూడ శబ్దరత్నాకరపాఠానుసారముగనే యున్నది. ఇట 'నానవరణ' చేయుట కవసరము లేదు. కాఁగా 'నత్తకమ్మ, అనియే శ్రీప్రతి గ్రహించినది.

నత్తకమ్మ=పాచికలపందెము. (చూ. చి. ని. శ. ర. సూ. ని)

(3) "అన బలిరా మహాకవిశిఖాభరణంబ మదుక్తభాషణం
బున నీవు డిచ్చునుత్తరము పూని విచిత్రపుఁబద్య మయ్యె మే
లని విభుఁ డాడె నట్లదియటంచుఁ గవీంద్రుఁడు నవ్వె నవ్వె నా
యన పరియింపుమా తిరుగ నన్నుఁ దదుక్తికి మెచ్చె విప్రుఁడున్.
(ఉ. ౧౭౩ వ. ప్ర. ౧౭౪ శ్రీ. ప్ర.)

ఇట "అట్లది. క. ఫ. బ. నవ్వె నవ్వె నాయన, అన్ని ప్రతులు. సందర్భశుద్ధికై 'నవ్వ' సవరించితిమి" అని చిత్తులో వ్రాయించిరి. ఇది కళాపూర్ణుఁడలఘువ్రతప్రథమాగమాదులను సత్కరించుసందర్భము. ప్రథమాగమాదులసమాభాషణము విచిత్రవృత్తపద్య మందున్నది. మే ని విభుఁ డనను. ఈ నది యుల్లేయగు నని కవి నవ్వెను. తిరుగఁ బఠింపుమా యనుచు రాజు చిఱునవ్వు నవ్వెను. తదుక్తికి బ్రథమాగముఁడును మెచ్చెను. అని పద్యసమన్వయము కుదురుచునే యున్నది. మఱియు ముద్రితములన్నిటను:-

"అట్లది యనటంచుఁ గవీంద్రుఁడు నవ్వె నవ్వె నా
యన పఠియింపుమా తిరుగ నన్నఁ దదుక్తికి మెచ్చె విప్రుఁడన్."

అని యున్నది. ఈపద్యముకును "మహాకవిశిఖామణి వార,...కవీంద్రుఁడు నవ్వె...పల్కె నాయన...తిరుగ నంచు" అను మార్పులతో నేలూరిప్రతిపాఠ మున్నది. ఇందు "తిరుగ నంచు" మాత్రము గ్రహించి పూర్వముద్రణములందున్నట్లే మిగిలినపద్యమును నూతనప్రతి గ్రహించినది. ఆవిచిత్రపద్యము విన వలె నను నానసక్తిచే వినువా రెన్నిపర్యాయములైనను తిరుగఁ జదువు మనుట సంభవమే. అంతేకాక రాజకోపింగితమును బూర్తిగ గ్రహించినట్లు ఆపద్యమును 'తిరుగవేసి, అనఁగాఁ దలక్రిందుగాఁ జదువు మనుటయుఁ దదుక్తికి విప్రుఁడు మెచ్చుటయు నిట సంభవములే. కాన నిట 'నాసవరణ, అవసరము లేదు.

(4) కళాపూర్ణుఁడు మధురలాలసను వర్ణించుసందర్భమున —

"ఎక్కడియుపమాకల్పన
లెక్కడి యుత్ప్రేక్షరచన లెక్కడి మతినే
ర్పెక్కడి వర్ణన లెక్కడి
యొక్కవిధా కృతుల కంద నింతిబెడంగుల్. (౭ ౧౦ మ. ప్రౌ)

ఇట. "లెక్కడి పెక్కడి, అన్ని ప్రతులు, ఖ. టీకనుబట్టి సవరణ" అని పేజీక్రిందఁ జిత్తులో వ్రాసినారు.

"ఎక్కడి వెక్కడి వాఙ్మతుల కందవు" (వా. ప్ర. బహూ. ప్ర)
"ఎక్కడి వెక్కడ? వాఙ్మతుల కందవు" (సర. వ్రి. పాఠము)

ఈపాఠమే నూతనముద్రణము గ్రహించినది. ఈ యుపమాకల్పనలు, ఈ యుత్ప్రేక్షలు వీనిదారి వీనిదే. ఆమెయందలి యుపమే యుపామ్రేడితాని దానిదే. అనఁగా 'ఎక్కడి వెక్కడ' అనుదానికి నీలోకమందలి యువత మాత్ప్రేక్ష లామె యువతీవాదిసౌందర్యమునందు నిలువలే వని భావము. ఆభావమే వాఙ్మతుల కీమాంతిపెనంగు లంద వని కవి ప్రపత్తించి నాఁడు. కాఁగా,

క... "ఎక్కడి వెక్కడ? వాఙ్మతుల కంద వింతిపెడంగుల్" అని నూతనప్రతిపాఠము సరిగనే యున్నది. ఇట 'సవరణ'తోఁ బనిలేదు.

(5) నర్మసచివుని నర్మోక్తిసందర్భమున :-

"ఎన్నఁడైనను దొల్లి నీ కిపుడువోలె
నీమది న్నిల్వసాగనే యోమృగాక్షి
వెరవటుంటఁబట్టి దినమును వింత వింత
లైనయూహల్ చూడ మాకబ్బెఁగాక.
(౭. ౨౧ వా. సర. బహూ. ప్రతుల. పా)

"నీమది న్నిల్వసాగించి" వింతవింతలైన" అను భేదముతో మల్లాది ప్రతి. పా. ఇట వీరు "నిల్వసాగిజేయూ మృ. క. ఖ. నిల్చిచాగిజేయూ మృ. గ. నిల్చిభోగిజేయూ డ. పాఠము సందిగ్ధము. ఖ. టీక, జేయూ= దొరా! అన్నది- తోఁచినట్లు సవరించితిని" అని పేక్రిందఁ జిత్తులో వ్రాసిరి. "నీమది న్నిల్వసాగి జియ్యా! మృగాక్షి" అనుపాఠము వెలూరు తిరుపతిప్రతులం దున్నది. గీతప్రథమపాదము పై సీసపద్యము లోని కవ్వయము. ఓజియ్యా! ఆమె నీమదిని నిల్చి వెరవటుంటఁబట్టి యిట్టివనులు మాకుఁ జూడ నబ్బె నని యన్వయము. నూతనముద్రణ మీపై పాఠమునే గ్రహించినది. తోఁచినసవరణయందలి సాగించి, అను ప్రేరణార్థమునకు సమన్వయ మెట్లో ?

(6) మఱియు నీసందర్భముననే: —

"ఆమఱపుడోన యిట్లని యాత్మఁ బొదివి
వేఁచుచున్నది యొట్లన్న వినుము దెలియ
దానఁ బరితప్త యయ్యె నూహానుభూతి
తనయు తదవాప్తి నీయాత్మ తావ మొందె

(౭. ౩౧. వా. జ. వ పా.)

"... ... ... ... ఇట్లు నీయాత్మఁ బొదివి,
వేఁపుచున్నది ... ... ...
... ... తదనాప్తి నీయాత్మ తావ మొందె. మల్లా. పా.

ఇట వీరు. తదవాప్తి, అన్నిట 'తదనాప్తి, నానవరణ, అని చిత్తులో వ్రాయించిరి

"ఆమఱపుడోన యిట్ల నీయాత్మఁ బొదివి
వేఁచుచున్నది ... ... ...
తనయు తదవాప్తి నీయాత్మ తావ మొందె"

అని మూలసముద్రణపాఠము. మల్లాదివారిట 'తవాప్తిని, అనాప్తిగఁ జేసియున్నారు అది యనవసరము. నీయాత్మ యామె నందుటచేఁ దావ మందినది. అని చెప్పిన సరిపడును. అనఁగా నీహృదయము నామెనే తగిలి యుండుటచేఁ దావ మందెనని భావము. ఇచట 'నానవరణ' ఏల?

(7) క్రముకకేతోత్తరపురమున వాపీరు రాఁగలందులకుఁ గల కారణము వివరించుచు నీక్రిందిపద్యము కవి చెప్పినాఁడు.

"ఫలముల్ పారిద్రవంక క్రముకిళితమణిశోభ వ్యాహింకర్ణ గృహశ్రీ
గళసౌభాగ్యభిషితములితపురముపైఁ గంతముల్ మించి యొప్పన్"

(౭ ౫౦) మల్లాది వారిల్ల ప్రతులయందీపాఠ మిట్లే గలదు.

ఇట కనువునందు మిళిత మైనమాణులు గలగృహలక్ష్ముల గళసౌభాగ్యము ననుకరించునవై వచ్చుకుండ్ల గెలలతోఁ గూడినపోఁకచెట్లు శిరోభాగములు పురముపై మించి యుండుటచేఁ గ్రముకకేతనము లైపైఁ గలపుర మని యూపేరు వచ్చిన దని భావము. కాని "సౌభాగ్యభిసితి

# తెనుఁగుబసవోదాహరణము.



పాల్కురికి సోమనాథకవి ప్రణీతము.

ప్రథమావిభక్తి.

ఉ. శ్రీగురులింగతత్త్వరుఁ డశేషజగన్నిధి, శుద్ధతత్త్వసం
యోగసుఖప్రవర్తి వృషభోత్తమమూర్తి యుదాత్తకీర్తి ది
వ్యాగమమార్గవర్తి బసవయ్య కృపాంబుధి మాకు దివ్యసం
భోగములం బ్రసాదసుఖభోగములం గరుణించుఁ గావుతన్.

కళిక - మధురగతిరగడ.

వెండియుఁ ద్రిభువనవినుతి సమేతుఁడు
మండితసద్గుణ మహిమోపేతుఁడు
సురుచిర శివసమ సుఖసంధానుఁడు
పరమ పరాపర భరితజ్ఞానుఁడు
విదితానందాన్వితమనస్కుఁడు
సదమల విపులవిశాలయశస్కుఁడు
శ్రీ విలసితపదచిరతరభద్రుఁడు
[1]గావుత సాక్షాత్కలియుగరుద్రుఁడు.

ఉత్కళిక.

భువనోత్క[1a] కార సౌఖ్యాబ్ధిలోన
భవమోద[2]పీర ముఖ్యుఁడై తాన
భక్తిసం[3]యోగ వెలయుశుభకరుఁడు
ముక్తిసం[4]భోగ [5]వలి విశ్వగురుఁడు

ద్వితీయావిభక్తి.

చ. వసి గొని మెచ్చఁ డేని బసవా యను నీ సుకృతాక్షరత్రయం

---

(1) గావున (1a) కారా (2) పీరా (3) యోగా (4) భోగా (5) ఇల.

బెనఁగఁ బఠించ నేని గిరిజేశున కాతని వక్త్రగహ్వరం
బసద్భృతగేహ మన్న [1]యది యార్యులవాక్యము [2]నట్లుగావునన్
బసవన [3]పుణ్యమూర్తిఁ దలఁపంగదె చిత్తమ! పాయు నాపదల్.

కళిక- ద్విరదగతిరగడ.

వెండియును భక్తాభివృద్ధిఁ బెంచినవానిఁ
[4]బండమాయాచార [5]సరణిఁ ద్రుంచినవాని
నద్వైతవాక్యసంహారుఁడై చనువాని
విద్వత్తములఁ[6] గెల్చి వీరుఁడై మనువాని
మీమాంసకులముక్కు మిగులఁ గోసినవానిఁ
[7]దామసధ్వాంతంబు తగులఁ బాసినవానిఁ
బెక్కుదైవంబులన్ బేరు మాపినవాని
నొక్కఁడే రుద్రుఁడన్ [8]సూక్తిఁ జూపినవాని

ఉత్కళిక.

ప్రకృతివాదము దుడిచి భూమిభారముఁ బాపఁ
వికృతివేషము [9]విడిచి గావించుగతిఁ జూప
సకలవాదుల నోర్చి నెమ్మిఁ జాలినవాని
సుకృతమార్గము దీర్చి మమ్ము నేలినవాని.

తృతీయావిభక్తి.

ఉ. జంగ[10]మపాత్రుచే సమయసమ్మతుచే భవరోగవైద్యుచే
మంగళమూర్తిచే గరళమర్దనుచే సనమానశౌర్యుచే
లింగకుమారుచే బసవలింగముచే బసవయ్యచేఁ గృపా
సంగతుచేఁ బ్రసాదసుఖసౌఖ్యము నొందెద భక్తిఁ జెందెదన్.

కళిక-ద్విరదగతిరగడ.

వెండియును వేదోక్తవిలసచ్చరిత్రుచే

---

(1) యని, (2) లట్లు, (3) బుణ్య, (4) బంధ, (5) పథము, (6) విద్వత్తముం, (7) తామస, (8) నియుక్తి, (9) ఉడిచి. (10) మా.

దండిభవబంధనలతా చయలవిత్రుచే
విధినిషేధాతీత వినుతైకగమ్యుచే
బుధజనప్రోద్గీత భువనాగ్రగణ్యుచేఁ
ప్రవిమల శివాచార భవ్యప్రచారిచే
భవిజన పరిత్యా[1]గభక్తి [2]భండారిచే
శివచిన్మయా పరిచ్ఛిన్నప్రమోదిచేఁ
పరమార్థతత్త్వానుభవ సుఖాస్వాదిచే.

ఉత్కళిక.

స[3]న్నుతుల [4]గడి గట్టి　　శివలీల పెంపార
మన్ననల తుదముట్టి　　భువి బసవఁ [5]డనుపేర
ప్రమథకవిలియ కెక్క　　పొలయు సువిధజ్ఞుచే
విమలసంపద నిక్క　　నెలయుతత్త్వజ్ఞుచే

చతుర్థవిభక్తి.

చ. అలనిప్రసాదసౌఖ్యమున కంగము కీర్తికిఁ గర్ణముల్ గుణ
స్తుతులకు జిహ్వయుం జరణతోయజ సంగతికిన్ మనంబు న
మ్రతగుణ దివ్యమూర్తికి నమస్కృతియున్ విధియించి కూ[6]డు న
ల్లతులితపుణ్యుఁడై నబసవయ్యకునై ప్రణమిల్లు చిత్తమా !

కళిక- ద్విరదగతిరగడ.

వెండియును నిర్మలపవిత్రగోత్రునకునై
ఖండిత[7]స్తవనైక పాత్రగాత్రునకునై
దురితభంజనకళాధుర్యచరితునకునై
పరవి నిష్ట్రవతాశ్వర్య భరితునకునై
సవిశేషవిమలగుణ జాలలోలునకునై
శివయోగసంధానశీల పాలునకునై

(1) త్యాగి. (2) బండారి. (3) న్న. (4) గరి. (5) బసవు. (6) కూడ.
(7) స్తవనీయ.

([1]భక్తిసీమంతినీ ప్రాణనాథునకునై
భక్తగణసేవనవ్రతసనాథునకునై.)

ఉత్కళిక.

లింగచిహ్నాలు మోచి లింగములుగాఁ [2]దెల్పి
దొంగ లుండఁగఁ జూచి జంగమేచ్ఛలు [3]సల్పి
కొంగులను బొదిగొన్న భవరోగహరునకై
వంగకాయలు మున్న శివరూపధరునకై.

పంచవిధభక్తి.

చ. పొసవరి పోరుదూమకులపొం గణఁగించి వధించి మించి యా
వ్వసము ప్రసాదినై యనుభవించి జగంబుల నెల్ల మించి పెం
పెసఁగఁగఁ దేజరిల్లెడుమహిష్ఠయశోనిధి గాన మెచ్చుదున్
బసవనదండనాథువలనన్ [4]గడియింతుఁ బ్రసాదసౌఖ్యముల్.

కలిక - ద్విరదగతిరగడ.

వెండియును జగదేకవీరభక్తమువలన
భండారి [5]బసవసత్పండితోత్తమువలన
వీరమాహేశ్వరాన్వితవర్తనువలన
ఘోరసంసారసంత్రస్తభక్తరక్తనువలన
సుకృతదుష్కృతశుభాశుభవిదూరగువలన
సకలనిష్కళతత్త్వసౌఖ్యపారగువలన
నాదవిద్యాసుధార్ణవవిహారునివలన
[6]నాదివృషభేంద్రావతారునివలన

ఉత్కళిక.

సారజీవన్ముక్తి త్రోవఁ జూం డని పనుప
కారణం బగుభక్తి దైవజ్ఞులను మనుప

---

(1) ఈపాదములు, అసలు ప్రతిలో లుప్తములు. నాచేఁ బూరితములు.
(2) తెల్పి (3) సల్పి. (4) గజి, (5) బండారు, (6) ఆదిబసవ. భే.

చేకూరు [1]సన్మతము నోపుధీరునివలనఁ
ఏకలింగవ్రతము భావహారునివలన

షష్ఠీవిభక్తి.

ఉ. దుస్తరకర్మభూసురులు దూషకులై కులమెత్తి కల్కుచున్
నాస్తికులౌచుఁ జూడ శివనాగయగారి గుణించి వారి శ్రీ
హస్తతలంబునందు విమలామృతధారలు వెల్లిఁ గుర్యవా
ర్యస్తుతి నించు నబ్బసవరాజున కేనతిభక్తి సేయుదున్.

కళిక - తురగవల్గనరగడ.

వెండి[2]యు నవికారసార విదితముదిత మేళనునకు
ఖండి నిండి పొలుపు నలుపు భక్తియుక్తి పాలనునకు
భవ్య సేవ్య శరణ చరణ పద్మ సద్మ ఖేలనునకు
నవ్య దివ్య లలిత గళిత నాదభేద [3]లాలనునకు
యమనియమ నిరంతరాంత [3a]రంగసాంగవర్తనునకు
నమిత శమిత విషమవిషయ హారి భూరికీర్తనునకు
[4]నత్యనిత్య భోగరోగ యంత్ర తంత్ర దూరగునకు
సత్య నిత్య శుద్ధ బుద్ధ సత్త్వ తత్త్వ పారగునకు

ఉత్కళిక.

మహిఁ బురాతనోక్తభక్తి [5]సమత నెఱయ భువిని వెలసి
మహిత తత్త్వశక్తియుక్తి భ్రమతలీల పొలసి కొలసి
యిమ్ములొసఁగ లింగజంగ యున్నగణవిరాజితునకుఁ
మమ్ము లెపుడు[4a]ప్రాణలింగ [6]జెన్నబసవపూజితునకు

సప్తమీవిభక్తి.

చ. అనుపమగుణాఢ్యునందు శరణాగతవత్సలునందు జంగమ

(1) సమ్మత మెృక. (2) యుండ ? (3) లోలనునకు (3a) రాంగ (4) సత్య
(4a) ప్రాణలింగ మునకు (5) సమ్మతమగ (6) జన్న

వ్యసనమహిష్ఠునందు భవవారణ కా[1]రణునందు భక్తమా
నసశరిపూర్ణునందు గణనాథునియందు దయాపయోధి మా
బసవనియందు మాబసవపాత్రునియందు వసింపు చిత్తమా !

కళిక - హయప్రచారరగడ.

వెండియు [2]శివవీర్యునందుఁ
జండమదనశౌర్యునందు
దురితభయావిదూరునందు
సరస[2a]భక్తిసారునందు
సుకరశరణసూత్రునందు
సకలవిషయజై[3]త్రునందు
భువనసత్ప్రబుద్ధునందు
శివగణప్రసిద్ధునందు.

ఉత్కళిక.

శరణజనుల[3a] నమసి సంగ
వరపుఁబనుల తముఁగ లింగ
[4]మనము తనువు నిజమునందు
ధనము తగవు విజయునందు

సంబోధన ప్రథమావిభక్తి.

చ. ఎసఁగ ఫలాట వహ్నిఁ గుసుమేషు దహించినకాలరుద్ర ! మున్
గసిమసి [5]చేసి దక్షునిమఖంబు హరించిన వీరభద్ర ! యి
వ్వసుమతిఁ బుట్టి భక్తజనవశ్యుఁడ వైనకృపాసముద్ర ! రా
బసవ! భవత్ప్రసాదసుఖ భాజనుఁ జేయవె నన్ను నర్మిలిన్.

కళిక - (తురగవల్గన రగడ.)

వెండియును సమస్త్రైలోకవిదితవిపులభక్తి బీజ !

(1) రణమందు (2) సుశివా (2a) భక్త (3) జైత్ర (3a) సమువు (4) తగవు తనువు ధనము మనము (5) సిఁజేసి.

దండి తేంద్రియప్రచండతరళవిషమ గుణసమాజ !
జంగమప్రసాదభోగ సారసౌఖ్య శరధిమగ్న !
లింగసంగతానుభావ లీలశరధి [1]సంవిలగ్న !
అతులసకల భువనపావనావతార పుణ్యమూర్తి !
సతత వితతవిమలతత్త్వ సారసౌఖ్య [2]పరిస్ఫూర్తి !
భవభయప్రపారదూర భవ్యసులభ సుకృతికాయ !
[3]దివిజబృంద వందిత ద్వితీయ శంభునామధేయ!

ఉత్కలిక.

పరమగురుమతానుకూల ! శ్రీవృషేంద్రదివ్యమూర్తి !
భరితసుగుణ గతివిలోల ! శైవసమయచక్రవర్తి !
లింగపూజనా విధేయ ! భక్తిసత్క్రియాధురీణ !
జంగమా[4]ర్చనానపాయ ! [5]భుక్తిముక్తిదప్రవీణ !

సార్వవిభక్తికము.

ఉ. నీవు దయాపయోనిధివి; నిన్ను నుతించినఁ గల్గుభక్తి; నీ
చే వరవీరశైవరతి చేకుఱు; నీ కయి యిత్తుఁ గబ్బముల్
నీవలనం గృతార్థత జనించును నీకు నమస్కరింతు [6]నీ
భావమునందునుండి ననుఁ బా[7]పకుమీ బసవయ్య ! వేఁడెదన్.

---

పాల్కురికి సోమనాథకవి తెలుఁగున నొకటి సంస్కృతమున మఱియొకటి బసవోదాహరణముల రచించియున్నాఁడు. వానిలో మొదటిదానిని ప్రథమమున బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించి ప్రభవసంవత్సరమున 'భారతి' మాఘమాస సంచికలోఁ బ్రకటించి యున్నారు. రెండవది నేనును మిత్రులు శ్రీనిడుదవోలు వేంకటరావుగారును బరిష్కరించి "ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక" సం 32 సం 3-4 లోఁ బ్రకటించి యున్నాము. తెలుఁగు బసవోదాహర

(1) శరధిసోవిలగ్న. (2) జనవాతార్తి. (3) దివ్య. (4) జంగమార్చకా. (5) భక్తి. (6) నా. (7) బాయకుమీ.

ణము ప్రకటించుటలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమపరిష్కరణమును తెన్నుగా నిర్వహించినట్లు కాన రాదు. ప్రాయశః ప్రాచ్యలిఖిత పుస్తకాలయమున నిందుకుఁ బ్రత్యంతరములు లేకుంటచే దొరకిన యేకప్రతిని బట్టియే యుం దున్నదున్నట్లుగా వీరు ప్రకటించినట్లు దోఁచుచున్నది. అందువలన నేకాఁటోలు వీరు ప్రకటించిన యీ కృతిలోఁ గొన్నితావుల గణభంగములు, ప్రాసదోషములున్నగునవి కాన్పించుచున్నవి. మచ్చున కీక్రింది దృష్టాంతములఁ జూచునది.

ప్రథమావిభక్తియందలి యుత్కలిక.

“భువనోపకారా భవమోదవీరా, భక్తిసంయోగా-ముక్తిసంభోగా”

ఇందు పాదాంతము లందలి దీర్ఘములు హ్రస్వము లయి యుండవలెను. లేనిచో రెండవగణములో మాత్ర లెక్కువయి గణభంగము కలుగును.

ద్వితీయావిభక్తియందలి కళిక.

వెంశిమును భక్తాభివృద్ధిఁ బెంచినవాని- బంధమాయాచారపథముఁ ద్రుంచినవాని- (ప్రాసభంగము.)

షష్ఠీవిభక్తియందలి యుత్కలిక.

సమ్మతముగ భువిని వెలసి- ప్రమథలీల సొలసి రొలసి- (ప్రాసభంగము.)

సప్తమీవిభక్తికళిక.

వెండియు శివార్యునందు- (యతిభంగము.)

సంబోధనప్రథమయందలి కళిక.

భవభయప్రసారదూర- భవ్యసులభ సుకృతికాయ
దివ్యబృందవందిత ద్వి-తీయశంభునామధేయ.
(ప్రాసభంగము.)

ఇట్లే యితరస్ఖాలిత్యములు మఱికొన్ని యందందుఁ గలవు. కట్టకడపటి సార్వవిభక్తికపద్యములో “నాభావమునందు నొండి నను బాయ

కుమీ..." అనుచోట సప్తమీవిభక్త్యంతపదము బసవవాచకముగా లే దనియు "నీయందు" అని యూపద్యమునఁ జేర్పఁ గుదుర దనియుఁ బద్యపాఠము సరి గాదేమో యనియు శ్రీశాస్త్రిగారు తమయవతారిక లో వ్రాసి యున్నారు. ఇక్కడ సోమనాథునిపాఠము బసవవాచకముగా నే "నీభావమునందునుండి ననుఁ బ్రోవకుమీ" అనియైయుండునని నాయభి ప్రాయము. ఈకారణములచే నీబసవోదాహరణమును శుద్ధముగఁ బరి ష్కరించి మరలఁ బ్రకటించుట యవసర మని చిరకాలమునుండి నేను దలంచు చుంటిని. కాని దీనికి వ్రాఁతప్రతులు నాకులభింప లేదు. అందు చే శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించినదానినే మాతృకగా గ్రహించి సోమనాథుని ప్రయోగసంప్రదాయముల ననుసరించి సాధ్య మయినంత వఱకుఁ గవిపాఠముల గుర్తించి పునర్ముద్రణ మొనర్చుట మంచి దని సంస్కృతబసవోదాహరణ ప్రకటనానంతరము దీని నిట్లు ప్రకటించి తిని. నేఁజేసిన మార్పులు తెలియుటకై శాస్త్రిగారి ప్రథమ ముద్రణ పాఠముల నడుగునఁ జూపినాఁడను.

కళిక లేయే రగడలక్షణములకు సరిపోవునో కూడ సూచించితిని. సప్తమీవిభక్తి యుత్కళికలో 5, 6, 7, 8, పాఠము లందలి యర్థము సంగతముగా లేదు. కవిపాఠము లింకను విచారణీయములు.

బండారు తమ్మయ్య.

# దర్శనసమీక్ష.



సాహిత్యశిరోమణి, భాషాప్రవీణ
చిలుకూరి వీరభద్రశాస్త్రి

(అనువృత్తము)

---

ఆస్తిక దర్శనములు.

## రామానుజదర్శనము.

ఇది విశిష్టాద్వైతదర్శన మనియు వ్యవహరింపఁబడును. చిద్విశిష్టుఁడు (చేతనముతోఁ గూడినవాఁడు) నచిద్విశిష్టుఁడు (జడముతోఁ గూడినవాఁడు) నగు నీశ్వరున కైక్య మని దానియర్థము. చిదచిద్విశిష్టమగు బ్రహ్మ మొకఁడే తత్త్వమని ఫలితము. లేదా 'విశిష్టంచ విశిష్టంచ విశిష్టే. విశిష్టయో రద్వైతం, అనువ్యుత్పత్తిచే నొకవిశిష్టపదమునకు స్థూల చిదచిద్విశిష్టబ్రహ్మము (కార్యము) అర్థము. రెండవపదమునకు సూక్ష్మ చిదచిద్విశిష్టబ్రహ్మము (కారణము) అర్థము. ఆరెంటికి (కార్యకారణములకు) నభేదము అనియర్థము

ఈదర్శనమునఁ బ్రధానముగ మూఁడు తత్త్వము లంగీకరింపఁబడినవి 1. చిత్తు (చేతనము) 2. అచిత్తు (జడము) 3. ఈశ్వరుఁడు, అని. చేతనుఁడగు జీవుఁడు అనుభవించువాఁడు. అచిత్తగు జడజాతము జీవునకు భుజింపఁదగినది. ఈశ్వరుఁడు జడచేతనములు రెండిటి కంతర్యామియై (లో నున్నవాఁడై) వాని నాయాక్రియలయందు నియమించును. ఈశ్వరుఁడు సజాతీయ-విజాతీయ-స్వగతరూపమగు భేదములతోఁ గూడిన వాఁడు. ఈ యీశ్వరుఁడు జీవజడములను వ్యాపించి యుండుటచే 'ఆత్మ' యని చెప్పఁబడు. దేని నెయ్యది వ్యాపించియుండునో దాని కావ్యాపించిన దాత్మ యగునుగదా. అట్టి యాత్మకు (ఈశ్వరునకు) చేతనజడములు రెండు స్థూలసూక్ష్మావస్థలయందు శరీరములై యుండును.

అచిత్తునకు (జడమునకు) స్థూలావస్థ యనియు సూక్ష్మావస్థయనియు రెండవస్థలు కలవు. స్థూలావస్థను బొందుటయే పరిణామము. చిద్ద్రవ్యమునకు (జీవునకు) స్వరూపమునందు మార్పులు లేవు. దాని ధర్మములగు జ్ఞానాదులకుఁ గర్మచే సంకోచవికాసములు కలుగును. ధర్మమగు జ్ఞానముకూడ నొకతత్త్వము. చేతనుఁడు జ్ఞానిరూపద్రవ్యము. జ్ఞానమునకు జ్ఞానికి దీపమునకుఁ గాంతికివలె ధర్మధర్మిభావము. దీపకాంతికివలె ధర్మభూతమగు జ్ఞానమునకు కర్మావరణముచే వృద్ధిహ్రాసములు కలుగును.

సూక్ష్మావస్థయందు నచిద్ద్రవ్యమునకుఁ జిద్ద్రవ్యమును, చిద్ద్రవ్యమునకుఁ బరమాత్మయు, ననునీసమూహము కారణము. స్థూలావస్థయందు నిట్టి సంఘాతరూపమయి కార్యరూపమగును. ఈరీతిని విశిష్టమయినది కార్యమగుటవలనను కారణమగుటవలనను బ్రహ్మమే ముఖ్యతత్త్వము.

అచిత్తగుతత్త్వము సత్త్వరజస్తమోగుణాత్మకము. ఇది నిత్యవిభూతికంటెఁ గ్రిందనుండి వ్యాపకమయి యెల్లపుడు పరిణామముతోఁ గూడియుండును సుఖదుఃఖమోహాదుల కిదియే హేతువు కావున మోక్షము పొందఁగోరువారికిఁ బరిత్యజింపఁదగినది.

వీరిమతమున చేతనులు (జీవులు) నిత్యులు, అణుపరిమాణులు, స్వయంప్రకాశులు, జ్ఞానానందస్వరూపులు, జ్ఞానగుణోపేతులు, ఏకరూపులు, భగవంతునకు శేషభూతులు.

ఈశ్వరుఁడు చిత్తును అచిత్తును నిర్వహించును. చేతనమును నిర్వహించుట యన చేతనములచే నాశ్రయింపఁబడి వారివారి యధికారానురూపముగా ఫలముల నిచ్చుట. అచేతనమును నిర్వహించుట యనఁగా నాయాయికర్మల కనుగుణముగా భోగ్యముగాను, భోగసామగ్రిగాను, భోగస్థానముగాను నచిత్తును బరిణమింపఁజేయుట. ఈవిధమున నీశ్వరుఁడు జగజ్జన్మస్థితిలయహేతువయి చేతనాచేతననిర్వాహకుఁడు,

సంసారులకు సంసారహేతువు, ముముక్షువులకు మోక్షహేతువు నగును. అతఁడు నిత్యుఁడు, విభువును, అతనినామము వాసుదేవుఁడు.

అతఁడు పరమకారుణికుఁడు, భక్తవత్సలుఁడు పరమపురుషుఁడును. అతఁ డుపాసకులకు నాయాయిఫలముల నిచ్చుటకై తనలీలచే ౧. అర్చ ౨. విభవము ౩. వ్యూహము ౪. సూక్ష్మము ౫ అంతర్యామి, యను విభాగముల నాశ్రయించును. అందుఅర్చ-ప్రతిమాది. విభవము-రామాద్యవతారము. వ్యూహము-వాసుదేవుఁడు;సంకర్షణుఁడు,ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుఁడు అనునది. సూక్ష్మము - షడ్గుణసంపూర్ణమగు బ్రహ్మము. అంతర్యామి-సకలజీవనియామకుఁడు. ఏనిలో పూర్వపూర్వమూర్త్యుపాసనచే నుత్తరోత్తరమూర్త్యుపాసనమునం దధికారము లభించును.

అతనియుపాసన 1. అభిగమనము 2. ఉపాదానము 3. ఇజ్య 4. స్వాధ్యాయము 5. యోగము. అని యైదువిధములు. ఇదియే పాంచరాత్రుల కభిమతము. అందు అభిగమనము - దేవతాస్థానాదులను దుడుచుట, అలుకుట, ముగ్గుపెట్టుట. ఉపాదానము - గంధపుష్పాది పూజాద్రవ్య సంపాదనము. ఇజ్య-దేవతాపూజ. స్వాధ్యాయము-నామానుసంధానుపూర్వకమంత్రజపము, వైష్ణవసూక్తస్తోత్రపాఠము. నామసంకీర్తనము, తత్త్వప్రతిపాదకశాస్త్రాభ్యాసము. యోగము- దేవతననుసంధించుట.

ఈమతమున జీవుల కనాదిపుణ్యపాపరూపమగు కర్మబలముచే జ్ఞానమునకు సంకోచము, తన్మూలకమగు దేవతిర్యఙ్మనుష్యాదిదేహసంబంధము, సంసారము కలుగును. ఫలమును గోరక కర్మల ననుష్ఠించుటచేఁ బుణ్యాపుణ్యకర్మసంబంధముపలన నివృత్తియయి మోక్షము లభించును.

మోక్షమునందు జీవులకుఁ గర్మ మరలంటత్రోడనే జ్ఞానసంకోచమునకుఁ గారణము లేకపోవుటచే జ్ఞానము విస్తృతమయి యుండును. మఱియు మనోరథానుసారముగా సర్వజ్ఞులు, సర్వానుభవశీలురు, నయి

యుందురు. తమయిచ్ఛచే గ్రహింపఁబడిన యనేకాకారములు కలవారయి, శరీరముతోఁ గూడియుఁ గూడకయు తమకు మిక్కిలియుఁ గోరఁదగిన లక్ష్మీనారాయణకైంకర్యము నొంది ఆతనిగుణములు కలవారయి యుందురు. కర్మబంధరూపమగు సంసారమును మరల నొందరు. సర్వలోకసంచారము కలవారయి యుందురు.

మతసంగ్రహము.

ఈమతమువారు మాయావాదమును గాని వివర్తవాదమును గాని యంగీకరింపరు. పరిణామవాదము సంగీకరింతురు. సత్ఖ్యాతిని సమర్థించెదరు. జీవన్ముక్తి యనుదాని నొప్పుకొనరు. మోక్షావస్థయందుఁ గూడ జీవబ్రహ్మములకు భేదమే యుండునని యందురు.

పూర్ణప్రజ్ఞ దర్శనము.

ఆత్మతత్త్వమును దెలుపుటయం దెవనికి నిశితమగు ప్రజ్ఞ కలదో యట్టి మధ్వాచార్యుఁడు పూర్ణప్రజ్ఞుఁ డని చెప్పఁబడును. ఈతనిచే రచింపఁబడిన దర్శనము 'పూర్ణప్రజ్ఞదర్శనము.' ఇదియే మధ్వదర్శనమనియుఁ జెప్పఁబడును. ఈపూర్ణప్రజ్ఞాచార్యులు వాయువునకు మూఁడవ యవతార మని తన్మతానుయాయుల యభిప్రాయము. ఈవిషయ మీ క్రిందిశ్లోకమున నిట్లు చెప్పఁబడినది.

శ్లో. ప్రథమస్తు హనూమా న్స్యాత్ ద్వితీయో భీమ ఏవచ,
పూర్ణప్రజ్ఞ స్తృతీయశ్చ భగవత్కార్యసాధకః.

"మధ్వోఖ్య యస్తు తృతీయ మేత దమునా గ్రంథః కృతః కేశవే."
వాయుదేవుని మూఁడవయవతారము మధ్వాచార్యులు. ఇతఁడు కేశవార్పణబుద్ధిచే భారతతాత్పర్యనిర్ణయ మనెడి గ్రంథమును రచించినని యిటు మనకుఁ దెలియవచ్చుచున్నది.

వీరిమతము 'ద్వైతము', "ద్విధా ఇతం, ద్వీతం, ద్వీతమేవద్వైతం; ద్వీతస్యభావోవాద్వైతం" అనెడి వ్యుత్పత్తివలన 'ద్వైత' మనఁగా భేదము. ఆభేద మయిదు విధములు. 1. జీవేశ్వరభేదము. 2. జడేశ్వరభేదము.

3. జీవజడ భేదము. 4 జీవులకుఁ గల పరస్పరభేదము. 5. జడముల పరస్పరభేదము, అని. ఈభేదము నాశములేక యెల్లకాలమునందు స్పష్టముగాఁ గన్పట్టుచుండుటచే ననాది యని చెప్పఁబడు. లోకమున నేది యెప్పుడు ననుభూయమానమగుచుండునో (సత్యమో) దాని నస త్యము (కల్పితము) అనుట పొసఁగదు. కల్పితము (అయథార్థము) ఎల్లి కాల మనుభూయమానమగుట దుర్ఘటము ఏదియుత్పన్నమగునో యది నశించుట నిశ్చయము. ద్వైతము (భేదము) లేనే లేదనువారి మతము ప్రగుడ్డిమతముగాఁ దెలియవలయు నని వీరియభిప్రాయము. ఇది యం తయు నీక్రిందిశ్లోకములందు స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ జీవేశ్వరభిదాచైవ జడేశ్వరభిదా తథా
జీవభేదో మిథశ్చైవ జడజీవభిదా తథా
మిథశ్చ జడభేదో యః ప్రపంచో భేదపంచకః
సోఽయం సత్యోఽప్యనాదిశ్చ సాదిశ్చే న్నాశ మాప్నుయాత్
నచ నాశం ప్రయాత్యేష నచాసౌ భ్రాంతికల్పితః
కల్పితశ్చే న్నివర్తేత నచాసౌ వినివర్తతే
ద్వైతం నవర్తత ఇతి తస్మా దజ్ఞానినాం మతం.

వీరిమతము ననువష్టంభకముగా నీశ్రుతిని జెప్పెదరు "సత్య మాత్మా, సత్యో జీవః, సత్యం భిదా, సత్యం భిదా, సత్యంభిదా, మైవా రువణ్యో, మైవారువణ్యో, మైవారువణ్యః" అని. అనఁగాఁ బరమాత్మ సత్య ము. (త్రికాలాబాధ్యుఁడు) జీవుఁడు సత్యుఁడు. జీవేశ్వరులకు భేదము సత్యము. అరుభిః=దుష్టైః వన్యః భజనీయః నభవతి, దుష్టజనులచే నీశ్వ రుఁడు సేవింపఁదగినవాఁడు కాఁడు అనుట. ఇట సత్యం భిదా అనియు, మైవారువణ్యః అనియు ముమ్మాఱు చెప్పుటచే నభేదగంధ మెంతమాత్ర ము పొసఁగకుండుటయే కాక భేదమునకు సత్యత్వము దృఢీకృత మని యందురు.

ఎవఁ డెవనిని సేవించునో యాసేవకుఁడు సేవింపఁబడురాజాదుల కంటె భిన్నుఁడయి యుండుట లోకమున విదితమే అటులనే జీవులచే సేవింపఁబడునీశ్వరుఁడు జీవునికంటె భిన్నుఁడు అనుసనుమానముచేతను జీవేశ్వరులకు భేదము స్పష్టముగాఁ దెలియుచున్నది. మఱియు లోకమున జనుఁడు మిక్కుటముగ ధనము గోరి రాజు నుపసర్పించి యాతని గుణాతిశయమును గీర్తించి ప్రార్థించినపుడె యారాజు సంతుష్టుఁడై యాతనిమనోరథమును నెఱవేర్చును. అటులగాక నీరాజ్య మంతయు నా కొసంగు మనియు, నీవు నేను నొకటే యని యనిన రాజక్రోధము నకుఁ బాత్రుఁడగుటయేకాని లాభ మెంతమాత్రము పొందకపోవుట నిశ్చయము. కావుననే పెద్దలు

శ్లో॥ ఘాతయంతి హి రాజానో రాజాఽహమితి వాదినః
　దద త్యఖిల మిష్టంచ స్వగుణోత్కర్ష వాదినాం.

అనిచెప్పెదురు. గొప్పవారలతో నీచుఁడు సమముగా నుండెదనని యను కొనుటకూడ గొప్పవారల కపకృతి నొనరించుటయే. అట్టిమెక వారితో నభేదమును సంపాదింపఁగోరుట గగనకుసుమాపచయేచ్ఛవంటిది. కావున జీవేశ్వరులకు నభేదమనునది దుర్ఘటము.

వీరలు "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి," యనుశ్రుతి "యజమానః ప్రస్తరః, సంపూజ్య బ్రాహ్మణం భక్త్యా శూద్రోపి బ్రాహ్మణో భవేత్" మొదలగు తావులయందువలె బ్రహ్మవేత్త బ్రహ్మవంటి వాఁడు, శ్రేష్ఠుఁడు, అనురీతి నర్థవాద మని యందురు. తత్త్వమసి, అను శ్రుతియు భేదప్రతిపాదకము. తస్య త్వం, తత్త్వ మ్మను వ్యుత్పత్తిచే నీశ్వరునకు నీవు దాసుఁడవు, అని యర్థమువలన సేవ్యసేవకభావము దెలుపుచున్నదని యందురు పూర్వము సూపినయనుమానముచే సేవ్యసేవకులకు భేదము స్పష్టము కదా?

మఱియొకతీరున నీశ్రుతి భేదమునే చెప్పును. 'ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో', యనుశ్రుతిలో 'ఆత్మా అతత్ త్వం' అని పదచ్ఛేదము చేసి

కొనవలయును. ఎవఁడు స్వాతంత్ర్యాదిగుణయుక్తుఁడో యతఁడు పర మాత్మ. నీవుతూత్రము అతత్ = ఆ యీశ్వరునికంటె భిన్నుఁడవు, పరాధీనుఁడ వగు జీవుఁడవు. ఈవిధమున సేవ్యసేవకభావ ముండుటంజేసి జీవేశ్వరులకు భేదము సతత మని యందురు.

ఈశ్వర (హరి) సేవ వీరిమతమునముఖ్యతమము. ఆసేవ ౧. అంక నము ౨. నామకరణము 3. భజనము అని మూఁడువిధములు.

అందంకన మన - శంఖము, చక్రము మున్నగు నారాయణుని యాయుధముద్రలను ధరించుట. దీనికి "అతప్తతనూర్న తదామో అశ్నుతే" అనియెడు శ్రుతి మూలము. ఎవఁడు తప్తముకాని (కాల్పఁ బడని) శరీరము కలవాఁడో వాఁడు అముఁడు కల్మషసహితుఁడు కావున వాఁడు విష్ణుపదమునొందుట కర్హుఁడుకాఁడని పైశ్రుతి కభిప్రాయము. తప్తముద్రాధారణ మీమతమునఁ గడు ముఖ్యము. బ్రహ్మాండపురాణ మునం దీవిషయ మిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ కృత్వా ధాతుమయీం ముద్రాం తాపయిత్వా స్వకాం తనుం,
చక్రాదిచిహ్నితాం భూప ధారయే ద్వైష్ణవోత్తమః. అని.

నామకరణమన-పుత్రులను కేశవుఁడు, నారాయణుఁడు, మున్న గుపేరులచే వ్యవహరించుట. ఈరీతిని పేరిడుటచే నిరంతరము నారా యణనామస్మరణ మగు నని తలఁచెదరు.

భజనము-కాయిక, వాచిక, మానసిక, భేదములచే మూఁడు విధములు. అందు వాచికభజనము- సత్యము, హితము చెప్పుట, స్వాధ్యా యాధ్యయనము. దానము, పరిత్రాణము, పరిరక్షణము, కాయికభజన ము. దయ, స్పృహ, శ్రద్ధ మానసికభజనము. ఈత్రివిధమగు భజన మునకు విష్ణుని బ్రీతునిగా నొనర్చుటయే శ్రవణాసనము.

(సశేషము.)

# దీపాలవారి 'జితకాశి'

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

---

జితకాశి యనునది శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు చేమకూర వెంకటకవి సారంగధరచరిత్రమునకు వ్రాసినవ్యాఖ్యానగ్రంథము. లోఁగడ వేదము వేంకటరాయశాస్త్రిగారు వ్రాసినవ్యాఖ్యానమునందలి ప్రమాదములను సరిచేయుచు వీరు వ్రాసినగ్రంథము 500 ల పేజీలకు మించినది. ఇందనేకనూతనవిచిత్రవిషయములు పాఠకులు గ్రహింపఁగలరు. శబ్దస్వరూపము నిర్ణయించుతఱి శ్రీ పిచ్చయ్యగారు కొన్నిచోట్ల శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువును గూడఁ బ్రమాణీకరించుచు వచ్చిరి. కాని యచ్చటచ్చట శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువుపైఁ గొన్ని లోపములు ఉన్నట్లు వీ రారోపించి చూపిరి. ప్రకృత మావిషయములను మాత్ర మెత్తి సూర్యరాయాంధ్రనిఘంటుహృదయమును వెలువఱింపఁబూనుటయే యీవ్యాసమునకు ముఖ్యోద్దేశము.

(1) *శా. పా. కొండఁజేయు, ఇదితప్పు. కొండచేయు అని ప్రతి. గొప్పచేయు అని యర్థము. కొండచేయుట యనఁగా కొండంత (గొప్ప) చేయుటగాని కొండను చేయుటగాదు. చూ. జితకాశి 343 పుట.
ఇట సారంగధరలోని పద్యమిది.

"గట్టిచన్గవ చేత ముట్టి చూచెద నన్నఁ
జెలి యది రొంకకొండ చేసికొనదు. 2-226."

---

N. B. ఈవ్యాసమున సూ. ని. అనఁగా శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువును, శ. ర, అనఁగా శబ్దరత్నాకరమును, బ్రౌ. అనఁగా బ్రౌనుదొరగారి నిఘంటువును. పూ. ము. పా. అనఁగా పూర్వముద్రితపాఠము అనియు, శా. పా. అనఁగా. వేదం వేంకటరాయశాస్త్రిగారి పాఠమనియు గ్రహించునది.

పై పద్యమునఁ బిచ్చయ్యశాస్త్రిగారిమతప్రకారము 'కొండ చేయు, ఏకముగాఁ జేసికొనినచో "ఒక" పదమున కన్వయమేది? శా. పా. దే బాగున్నది. అప్పుడు 'ఒక' కు కొండతోనే సంబంధము, అంతేకాక వీరిమతప్రకారము తక్కినపాదములందలి క్రియలు "XX నంబుచేయు, బంగారుచేయు" మున్నగు పవేకక్రియ లనఁ జెల్లునా?

"కొండఁజేయు" అనిదే సూ. ని. పా. మఱియు నందు "కొండఁ జేయు=పెద్దచేయు, అనికూడా ఉన్నది. పెద్దఁజేయు అనని మొదున నో!?" అనియుఁ బ్రశ్నించి యున్నారు. చూ. జీతశాశి 343 పుట. ఇది విక్రమార్కచరిత్రయందలిపద్యవిషయము.

"కొండలెల్లను దను గొండఁజేయు" అని యందలి పద్యము. కొండఁజేయు, కొండదేయు లెట్లున్నను, ఇందలి కర్మపదమగు 'కొండ. జడవాచక మగుటచేఁ బ్రథమయుఁ గావచ్చును. ద్వితీయయుఁ గానగును. ఇందు తప్పేమి? మఱియు,

"గొప్పంజేయు, అనుటలోఁ గల దోషమెట్టిదో 'కొండంజేయు' అనుటలోఁగల దోషమును నట్టిదే" అన్నారు. వీరిదృష్టిలో 'కొండ, గొప్ప అనునవి, యొకజాతివా? మఱియు.'

"కొండచేయుట అనఁగా కొండంతచేయుట గాని కొండగుచేయుట కాదు." అని వ్రాసియున్నారు. ఇట కొండశబ్దము గౌణలక్షణచే "అగ్నిర్మాణవకః" ఇత్యాదులందువలె 'పర్వతసదృశము' అను నర్థమిచ్చును. ఇఁక నేకపదముగా గ్రహించినవీరిపక్షమున 'ఒక కొండ చేయు, అను సముదాయము నేకపదముగా గ్రహింపవలెను. ఒక పదమును పృథక్కుగా స్వీకరించినవీరిమతమున అభేదసంబంధముచే నేకదేశాన్వయము సంభవించును. 'కొండన్' అనునది పృథక్పద మనిన మొదల దోషము కనుపట్టును. పెక్కుగుణము లున్నవి.

(2) "శా. పా. మీఁది నమ్మకము చేత వావిళ్ల వారే కాదు సూ. ని. కూడా 'మరుబాముల' అనియే అన్నది. చూ. ఉటంకు. చూ. జితకాశి 347 పుట."

ఇట వీరి యాక్షేపణ మేమి యన—

"మరుబాములనఁగా మన్మథబాధలు. పరపురుషుఁడు తన్నంటిన యవమానమున కోర్వఁజాలక గొంతు కోసికొనఁబోవుచున్న స్త్రీ, నేను మరుబాముల పడలేనను నా? 'మఱిబాము' లని సరియైన పాఠము. పూ. ము. న నున్నది." అని వివరించి యున్నారు. శ్రీ పిచ్చయ్య శాస్త్రిగారిట ప్రకరణము గమనింపరైరి. ఇట వీరి పాఠముకన్న ప్రాఁత పాఠమే సర్వథా పరిపుష్టము ఎట్లన రెండవయాశ్వాసము 235 వ పద్యము చిత్రాంగిది. 236 వ పద్యము ప్రకృతము ఇందు అని, అని, అను పదములు రెండున్నవి. ఇందు మొదటి అని, పైపద్యార్థమును బరామర్శించును. మిగిలినపద్య మంతయుఁ గవి చెప్పినది ఇది గమనింపక 'గొంతుకోసికొనుస్త్రీ... ...నేను పడలేనను నా?" అని పిచ్చయ్య శాస్త్రిగారు వ్రాయుదురు. ఇట అనునది స్త్రీ యా.? కాదు కవి.

ఇఁక "మరుబాములఁ బడలేనని కైదువుదుస్సిదాఁటు నాయిలేము బలెన్" అనునది కవ్యుక్తిలో నుత్ప్రేక్ష. మన్మథుని బాములు పడలేని కత్తి లాగుకొనిపోవు సన్నాహమో యనునట్లు పెనఁగు నామెచేకత్తిని విడిపించి రా జనెను. అని యన్వయము. ఇట 'మఱిబాములు' ఏల? ఈసందర్భమును గమనించియే సూ. ని. నిర్దుష్టపాఠమును గ్రహించినది. మరుబాము లనుటలోనే స్వారస్య మున్నది.

(3) "N.B. సూనిలో 'దొంగలానఁ బొడిచిన' అని ముద్రితమైనది ప్రమాదము. 'దొంగలానవాడిచిన, కళాపూర్ణోదయము 3 ఆ. శ, ర. అని వ్రాసిరి. చూ. జితకాశి 411 పుట"

ఈవిషయము సూక్ష్మముగాఁబరికింపవలసినది. ఆసపాడుచు అను పదమునకు అఙ్ఞాపించు, అను నర్థముననే కవుల ప్రయోగములున్నవి. ఇది

శబ్దపల్లవము. ఇదియు సూర్యరాయాంధ్రనిఘంటువునఁ జూపఁబడినది. ఇఁక సూ. ని. లో 'ఆన' అను దానికిఁ గళాపూర్ణోదయపద్య మిచ్చి 4 వ యర్థము, ఆజ్ఞాముద్ర, అని వ్రాయఁబడినది. అట "ఆనఁబొడుచు" అనియే పాఠము. ఇది ప్రమాదమని విమర్శకుల యభిప్రాయము. ఇట 'ఆన, పొడుచు, అను నవి వ్యస్తపదములుగా గ్రహించినప్పుడే ప్రకృత పద్యార్థము ప్రకరణానుకూల్యము నందును. అట్లుగాక యేకపద మను కొని 'ఆజ్ఞాపించు, అను నర్థమున గతార్థము చేసినచో, ఆజ్ఞాపించుట వాగ్రూప మైనదిగాన, ఆయాన దొంగిలించుటయుం బ్రయోజకము. అట్టియాజ్ఞ యున్నను లేకున్నను దొంగకుఁ దెలియునదిగాదు. ఇఁక ముద్రారూపకాజ్ఞ యున్నచో సజాతీయుల కది గ్రహించుటలో వివ ర్తకముగా నుండును. ప్రకృత మదియున్నను దొంగిలించువానికి బాధ కము కానేర దనునభిప్రాయ మీప్రకరణమున కనుగుణము. దానిని స్ఫుటింపఁజేయుటకే సూ. ని. కళాపూర్ణోదయపద్యములోని దానిని పదద్వయముగా నిశ్చయించి 'ఆన' లోఁ జూపినది. కళాపూర్ణోదయము నందలి ప్రకరణమును బరిశీలించుచో నిది యెట్టులున్న నచటిసందర్భము సరిపడునో తెలియఁగలదు.

(4) "N.B. సూ. ని కరకర (=కఱకఱ)=వ్రాయుట నమలుట మున్నగువానియం దగుననుకరణము. అని యర్థము చెప్పి అందు క్రింద సారంగపద్యమును 'అసూయఁగరకరమంచు అను పాఠముతోనే యుదా హరించినది. ఆ 'కరకర, కు ఆకోశ ముద్దేశించినయర్థ మేమో ?" చూ జితకాశి 449 పుట"

అని వ్రాసి కోపమును దెలుపుపదము 'కొఱకొఱ, గాని 'కర కర, కఱకఱ,లు గావన్నారు. సూ. ని. ఈప్రయోగము 'అసూయచే పండ్లు గీటుట యందలిధ్వని కనుకరణమునకు లక్ష్యముగా గ్రహించినది. అట్లున్నను వీ రర్థము చేసికొనక చుక్కలు పెట్టుటయెందులకో తెలియదు. శాస్త్రిగా రిచ్చిన 'ద్వేషించు, అనునర్థము 'అంచు, పదసమభివ్యా

హారము చేతను "తునుము సంతకోశముతో" అను దానిచే 'ద్వేషించుచు, అనునర్థము గత్యార్థముగుటచేతను పొసఁగదు. అవ్యక్తానుకరణములగుటచే గిట్టిపదము లెట్లున్నను నుండవచ్చును.

(5) "శాస్త్రిగారి పాఠమును జదివియే గాఁబోలు సూ. ని. సంచితులు 'కమ్మసంజ=సంజులకమ్మ' రత్నములు కూర్చుటచే దివిటీల వలె వెలిఁగెడికమ్మ. అనివివరము వ్రాసిరి." చూ. జితకాశి 457 పుట.

సంజునకు దివ్వెటీ యనునర్థము ప్రసిద్ధముగా నున్నది. కమ్మ అనఁగా కర్ణాభరణము. ఇట 'సెమ్మోకు రేరాజ సన్నిధానము గాన కర్ణభూషణము లనెడిదివ్వటీలు రాజచిహ్నముగా నుండవలసినవే. ఇట వేదము వారి పాఠపా టేమి? ఈ రెండుస్థలములలోనివి రూపకములు కావా? ఇట పెద్దప్రమాదమఁట, అప్రమాద మేమో? ఇఁక "దివిటీల కాంతిని మెఱుఁగు లనుటయు లోకమున లేదు" అని వీరి యాపత్తి. ఇట రత్నసంబంధ ముండుటచే మెఱుఁగు లనుటలో విరోధ మేమియు లేదు. అదియుఁగాక దీపకాంతిని మెఱుఁగనుట యాక్రింది ప్రయోగమునఁ గలదు.

"ధూమంబు వోదివినఁ దుఱఁగలి మెఱుఁగులు
నలఁగి మాసినదీపకలికవగిది. విరాటపర్వము 1 ఆ.

దీనినిబట్టి దివిటీకాంతిని మెఱుఁగనవచ్చునేమో.

"శాస్త్రిగారికి సంజతత్త్వము తెలియలేదు" అని యొకమాట. సంజతత్త్వము పూర్తిగాఁ దెలిసిన శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు 'కమ్మ, తో సంబంధము లేని 'సంజ' నకు వారు వ్రాయించిన 'కమ్మలో పొదిగిన రత్నాలమొత్తము, అను నర్థముగల ప్రత్యేక ప్రయోగమును జూపింప రేలొకో? వీ రుదాహరించిన యాంధ్రపదపారిజాతమును బట్టి సంజనకే 'రత్నములు చెక్కినతాటంకములు, అను నర్థమున్నచో నిఁక 'కమ్మసంజ, నకు వీ రేమియర్థము చెప్పెదరో? ఇది యట్లుండ వీరిటీకలో "కమ్మసంజలమెఱుంగు=కమ్మలయందలిదుద్దులకాంతి" అని వ్రాయిం

చి. ఈవ్రాఁత పూర్వవిరుద్ధముకాదా? వీరి మతమున పంజునకే దుద్దు అని యర్థమా? అట్లైన వ్యవహారమున రత్నములు పొదిగిన కర్ణాభరణములకే 'దుద్దులు' అని యున్నదే. అప్పుడు కమ్మ అనుదాని కేమియర్థము చెప్పుదురో? తత్త్వమేమన 'కమ్మపంజు' అను పదముకడ సూర్యరాయాంధ్రనిఘంటువు వ్రాసినయర్థము యౌగికము. కాఁబట్టియే (— —) Hyphen, లో నున్నది. మొత్తముపై వచ్చునర్థము "రత్నములు చెక్కినకమ్మ, రత్నతాటంకము" అని వ్రాసియే యున్నది. ఈ వ్రాఁత పంజునకున్న ప్రాచీనప్రయోగములను బరిశీలించియే సూ. ని. వ్రాసినది. ప్రకృతము సారంగధరలోని 'కమ్మకంజు' అను రెండు పదములు ఏకార్థములు గావు. నిఘంటుపద్ధతిని బట్టి సూ. ని. వ్రాఁత నిర్దుష్టమూదము. నిశ్చయదృష్టిలేక తొందరత్రొక్కుడిగా వ్రాయించిన శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారివ్రాఁత యిట పూర్వాపరవిరోధముగలది.

(6) "శా. పా. గ్రచ్చుకొని. గచ్చుకొని, పూ. మూ. పా. ప్రాణ్యమునను శ. ర. లోను 'గచ్చుకొను' అను రూపమేగాని గ్రచ్చుకొను, అను రూపము లేదు. సూ. ని. లో ఏరూపమును లేదు. అని వ్రాసిరి. చూ. జిరకాశి. 491 పుట"

గ్రచ్చు, గచ్చు, లకుఁగలయర్థ మీసారంగలోని 3-216 వ గద్యమునకుఁ బొసఁగదు. కాఁబట్టి యీరెండుపదములకు ననుప్రయుక్తమగు 'కొను' కాదిది. సూ. ని. ఈపదమును బరుపాడిగా గ్రహించినది. పాపము!! శాస్త్రిగా రీపదమును జూచియుండరు. అందలియర్థ మీ ప్రకరణమునకుఁ జక్కఁగ సరిపడఁ గలదు.

(7) "కలయంగన్, క్రియావిశేషణము. శ. ర. లో, సూ. ని. లో గూడా లేదు. చూ. జిరకాశి 507 పుట"

కన్, అనునది నఞ్యంత మగునగుధాతువు. ఇది క్రియావిశేషణములకును నఞ్యంతక్రియలకును ననుప్రయుక్తమగును. కన్ విరహిత మయ్యును క్రియకు విశేషణమగుదానినే క్రి. విశే. అని యనుట

సూ. ని. పద్ధతి. 'కలశుంగన్' అనునది నఞ్యంతక్రియగాని క్రియా విశేషణము గాదు. (చూ. సూ. ని. అల్ల².) మఱియు నీవిషయము బాలవ్యాకరణక్రియాపరిచ్ఛేదము 115, 116, సూత్రములు, వాని వివరణమును బరికించినఁ దెలియును.

(8) "మలిక అను నర్థమున శ. ర. లో, కఱ, శకటరేఫముతో నే యున్నది. కాని, వ్రాసు 'కర' అన్నాఁడు... సూ. ని. లో ఈ 'కర' ఏ రేఫముతోనూ లేదు." అని వ్రాయించిరి. చూ. జితకాశి. 496 పుట.

ఇది శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి సాహసము. ఇట్టి ప్రసిద్ధపదమును, ఈపదమునకు సారంగధరలోని పద్యమును సూ.ని. ఎన్నఁడును విడువదు. ఇది రెండవసంపుటమున "కఱ్ఱ (అ)" అను పదములోనున్నది నాలుగు పాదములతో పూర్తిగా నీసారంగపద్యమునే చూపినది. (చూ సూ. ని. 2 సం. 167 పుట.) ఈపద్ధతి వీరు 'కరకర, లో గమనించియే యుందురు. ఐనను పొరపడిరి.

(9) "చనుమానము, నిఘంటువులలో లేదు. వ్యవహారమున నున్నది". అని వ్రాసిరి. చూ. జితకాశి. 196 పుట" ఇంతేగాక పునస్స మీక్షలో చనుమాన మనుపదమున కాధునిక ప్రయోగము చూపి దానికి గతి కల్పించిరి. సూ. ని. మూఁడవసంపుటములో 47 వ పుటట వేంకటనాథుని పంచతంత్రము, దశావతారచరిత్రము, నిరంజనోపాఖ్యానములనుండి ప్రయోగములఁజూపి యీపద మెత్తియున్నది. ఈసంపుటము వీరెఱుంగరు కాఁబోలు. ఇట్టిదే 'చీకటిక్కుట, యును. (చూ. సూ. ని. 3 వ సంపుటము)

(10) "కొమిరె, పాఠము అసాధువే యగుచున్నది. సూ. ని. యీపాఠమునే గైకొన్నది." చూ. జితకాశి 233 పుట, కొమిరె అను పాఠముతో సూ.ని. ఈపద్యము నెక్కడ నుదాహరించినదో శ్రీ శాస్త్రి గారు తెలుపకుండుటకుఁ గారణమేమో ?

పై విషయములఁ బరామర్శించి సూ. ని. లో గ్రహింపఁబడిన పాఠములు పదపదార్థములు నవిరుద్ధములని పాఠకు లెఱుఁగుదురు గాక. మొదటినుండియుఁ బ్రామాణికులగు పెక్కురు పండితు లేకాభిప్రాయముగ నిర్ణయించిన పదపదార్థములనే పూర్వోత్తరవిరోధములు లేకుండ గ్రహించుట, సూ. ని. పరిపాటి నాఁటికి నేఁటికి నీనిఘంటు నిర్మాణమున అనసరణీయే గ్రహింపఁబడుచున్నది. ఇట్లుండ సూ. ని. హృదయము సాకల్యముగ నెఱుఁగకయే దోషముల నారోపించుట శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి సాహసమాత్రమే యనియు, ఇట్టి యారోపణలు ప్రామాణికనిఘంటువుపై అనాలోచితముగ ఇతరులు చేయకుందురనియు నెఱిఁగించుటకే యింతవఱకు సమాధానమీయవలసి వచ్చినదని మనవి.

---

# భీమునినయోక్తులు.

---

ఉ. ప్రేయసి ప్రీతితోడఁ బచరించిన భాషణభంగి తోఁప మెం
తో రొయసరింప సర్థభరయుక్త మటంచు మదిం దలంచి, యు
క్త్యాయతయుక్తియుక్తము నుదారతరార్థము నైన వాక్యమే
ధానిధియైన వృకోదరుఁడు ధర్మజుతోఁ దగఁ బల్కె నీక్రియన్. ౧

ఉ. మానినిసన్నవ దృష్టిగరిమం బరికించియు నీతిమార్గముం
బూని మెఱుంగఁ జేసిన యపూర్వవిధానము నెంచిచూడఁ దా
నానని చెప్ప శక్యమె బృహస్పతికైనను నీభంగి వా
మానసమందు విస్మయము మహందగతిం బ్రభవించె నీయెడన్. ౨

గీ. తీర్థకారుఁడు మార్గంబు తెలిపి సేయ
మడుగులోనఁ బ్రవేశింపఁ గడఁగు టొక్కొ;
కార్యపథము నిరూపింపఁ గలుగు నతఁడు
తోలుత లభియించుటయె కడుదుస్తరంబు. 3

చ. అనఘము సద్గుణంబులనె యాదర మొప్పఁగ సేకరించు నీ
మనమున కీసుకల్మి లను మానము లేక రుచించుఁగాక; స
జ్జనులు గుణజ్ఞు లెన్నఁగ విచారము సేయ రొకించుకేని కా
మిని మగవాఁ డటంచు, మది మెచ్చెడిభంగిని బల్కుచోటులన్. ౪

ఉ. నాలుగువిద్యలందు గణనం గొనఁజాలువివేక మూని యా
లీలను నీదు డెందము చలించి, విపర్యయమంది, శంకమం
దోలి నణంగి ప్రమందెను మదోద్ధురసింధురభంగి డోఁచఁగాఁ
గూలుచున్న దోస్మృతికుంజర! యిట్టగు టెంత గర్హ్యమో? ౫

ఉ వైరిజనంబు చేఁగల విశద్దశ నీ విటు పొందియుండఁ బా
కారిము ఖాదరప్రభవు లక్ష్మిలి సంస్తుతి సల్పునట్టి నీ
పౌరుషమంతయుం బొలిసె; భాగ్యమె యిట్టి విపత్తు నందఁగా
నారయ నింతకంటెను మహత్తరదుఃఖ మొకండు గల్గునే? ౬

చ. కరుల శిరోగ్రభాగ దళనాగఁ జెండుగొనంగఁ జాలి లోఁ
బొరయుఁ గసీమ చేఁ బఱికించి, యుపేక్షవహించునట్టి భూ
వరుని సమాశ్రయంబు సకలార్థచయంబున నొజ్జగించి వే
సిరులు. దొలంగిపోవ కటిశీలన సేయఁ గొంకరయేనియున్. ౭

చ. ప్రియమున పేదయొక్క సహజంబుర లోకశుభావహంబు సు
శ్రీయశుజనవన్నులంబు నగు తేజముఁ దాల్చి సమృద్ధినొందఁగో
రియు జలనంబు చల్చుభూభుజు నరిందము నిం బ్రజ లెల్లవేళ మో
దయుతముగా ద్వితీయవిధుశర్వసముం బలెఁ గూర్తు రంజలిన్. ౮

ఉ. మానధనాగ్రగణ్యుఁ డభిమానయుతుండు ప్రిరోన్నతంబునా
స్థానము నొందఁ గోరుసయశాలికి పూర్ణమనస్వి కయ్యెడం
బూనిన యాత్మపౌరుషము పొల్పగుసాధన మెంచిచూడ న
ద్దాన ననర్థజాతము నదల్పఁగఁజాలెడుశక్తి యేర్పడున్. ౯

ఉ. అకడ లాక్రమించు నయనంబున శౌరుషహీనవృత్తి; న
త్యాకఠదుష్టకృత్యములు నాయతిలేక వినాశమందు; ని
ర్వ్యాపితభావివృద్ధియుతుఁ డందున లాఘవ మొందు; దాన దు
ర్ప్రాపకము గాదె గౌరవపదాస్పదం బగు రాజ్యలక్ష్మియున్. ౧౦

గీ. కాన విడనాడు మున్నతి కానకైన
వట్టియుద్యోగరాహిత్యవర్తనంబు
సంతతము నను బరాక్రమాశ్రయములైన
సంపదలు దుఃఖములతోడఁ జనవు గొనవు ౧౧

మ. మదసంసిక్తసమేధికానన లసన్మత్తేభకుంభంబు లు
న్మదలీల న్వికళించి, తాఁ గొనినమేదఃపూర్ణ మాంసంబుచే
కుదమొక్రం జరియించఁ గేసరి; జగంబుల్ స్వీయతేజంబు సం
గదలం జేయఁగఁ జాలుధీరుఁ డెపుడుం గాంక్షింపఁడన్యార్థముల్. ౧౨

ఉ. వైరినికారకష్టుఁ డనవద్యపరాక్రమసంయుతుండు దు
ర్వారయశుండు నైననర పాలుఁడు గర్వరప్రాణయుక్తిఁ బెం

పారదకీర్తిఁ గోర నచిరాంశువిలాసవశాశ్వతంబైన ఆ
క్షీరవతీసమాగమ మకించనకారియ గాదె యెంచఁగన్. ౧౩

గీ. జనుఁడు తృప్తిలయింతఁ దుజ్జ్వలజ్వలన మెపుడు
భస్మరాశి సుఖంబుగఁ బట్టఁగలఁడు
కాన నభిభూతిభయమున మానధనుఁడు
చయ్య నసువుల విడుచుఁ; దేజంబు విడఁడు. ౧౪

ఉ. ఏమిఫలంబు గోరి హరి హెచ్చిన రోషముతోడ గర్జదు
ద్దామఘనాఘనంబుం జెనకి తారతరంబుగ ఘీంకరించు; తే
జోమహామూర్తియై నెగడు శూరుఁడు కామ్యేడ వైరియున్నతి
స్నేహము లోర్వకుండుట యది సిద్ధము గాదె స్వభావసంబడన్. ౧౫

చ. అవధినిరీక్షణంబు తగ దంచు మనంబున నెంతువేని భూ
ధవ! సతతంబు జిహ్మగతితత్పరుఁడైన సుయోధనుండు నా
హవ మొనరింపకుండఁగనె యబ్బినపంబడ లాభ్యదించుచు
న్నవినయవృత్తిచేఁ విడఁగఁజాలునె యట్టి వివేక మూనునే. ౧౬

ఉ. తే కాలవేళ నజ్జనతతీరము దాల్చి సుయోధనుండు దు
ర్నీతమునైన రాజ్యపదమున్ దగ నీకిడనేని భూవరా!
నీ కనుజన్ములై జగతి నిచ్చలుఁ గీర్తి గడించియున్న యీ
మా కిఁక నేమిచేతఁ బ్రచండభుజప్రక్రమవిక్రమంబునన్. ౧౭

ఉ. దిక్కుల వన్నెకెక్కి చనుదెంచెడి దిగ్గజభంగి దోఁకఁ, జెం
పక్కన వాల్గునంద్రములు నెల్లలు దాఁటియు వచ్చుచున్నవో
యిక్కరణిం జెనంగ ననునేపు దలిర్ప రణంబు సల్పఁగా
నక్కనుమానమందుమున నిల్వగ శక్యమె వైరికోటికిన్. ౧౮

గీ. కాన నృపవర్యమోహంబు గానసీక
విక్రమముఁ బూనఁగా మది వెరపుగొనుము
నీ నిరుత్సాహమున వైరినికరమునకు
లేకయుండె విపత్తులు లేశమైన. ౧౯

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

## చతుర్థసంపుటము.

---

శ్రీపీఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000పుటలుగల ప్రథమసంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూడవసంపుటమును, 975 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగా నున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుగల సంస్కృతాంధ్రశబ్దములన్నియునుగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'ఙ' వఱకుగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'త్వ' వఱకుగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న్ర' వఱకుగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమైనది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుం గూడ లభ్యముగా నుండవలయు ననుతలంపుతో నీక్రింది వెలలు నిర్ణయింపబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు మేలుప్రతి రు 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు. ఈ సంపుటములు కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమున దొరకును.